THE ANDHRA PATRIKA, MADRAS.

Regd. No. M, 1118 సంపుటం 38. సంచిక 99

FOUNDER · DESODHARAKA K. NAGESWARA RAO.

మంగళవారం 10–7–1951 వెల 1 అణా.

# ఆంధ్రపత్రిక



# 1793 కోట్ల రూ.ల ఖర్చుతో దేశాభ్యుదయసాధనకు పథకం

## జులై 10 వ కొరియా యుద్ధ విరమణ సంప్రదింపులు

### కంభం సమీప గ్రామములో పోలీసుల కాల్పులు

**ముగ్గురు గ్రామస్థుల మరణం**

నంద్యాల, జులై 8: గత గురువారం నాడు కంభం తాలూకాలోని వెలగాలపాయ గ్రామస్థులకు, మలబారు స్పెషల్ పోలీసులకు నడుమ సంఘర్షణ జరిగినట్లు, ఆ సందర్భంలో పోలీసులు కాల్చిన తుపాకులవల్ల ముగ్గురు గ్రామస్థులు మరణించినట్లు వార్తలవల్ల తెలుస్తున్నది.

ఈ ప్రాంతాలలో కమ్యూనిస్టుల అల్లరులు జరుగుతున్నందువల్ల, ఆ గ్రామంలో కూడ ఒక గ్రామరక్షణ దళాన్ని ఏర్పరచేందుకు మలబారు పోలీసుల జట్టు వెళ్ళింది. ఆ గ్రామస్థులకు పోలీసులకు వివాదం ఏర్పడింది. వివాదానికి కారణం యింతవరకు తెలియలేదు. గ్రామస్థులు రువ్విన రాళ్లమూలంగా ఒక హవల్దార్, ఇద్దరు పోలీసులు గాయపడ్డారు. గుంపులుగా చేరిన గ్రామస్థులపై పోలీసులు తుపాకులు కాల్చారు. ముగ్గురు గ్రామస్థులు మరణించారు. దెబ్బతిన్న పోలీసులను గిద్దలూరు ఆస్పత్రిలో చేర్చారు.

జిల్లా కలెక్టరు, డి. ఐ. జి., డి. ఎస్. పి నిన్న అక్కడకు వెళ్ళి నేడు తిరిగి వచ్చారు. వెలగాలపాయ గ్రామం కంభానికి 30 మైళ్ళ దూరాన అడవి నట్టనడుమ వున్నది. అధికారులు కొండలు గుట్టలు మీదుగా 10 మైళ్ళు నడచి ఆ గ్రామం చేరుకోగలిగారు. స్వ. వి.

### యూరప్‌కి 240 కోట్ల డాలర్ల సహాయం

వాషింగ్టన్, జులై 8: జూన్ 18 వ తేదీతో అంతమయే సం॥లో యూరపు ఆర్థిక, సైనిక సహాయాలకింద మొత్తం 240 కోట్ల డాలర్లు ఖర్చు పెట్టబడినవని అమెరికా విదేశ సహాయసంస్థ నేడిక్కడ ప్రకటించినది. దీనివల్ల అక్కడ పారిశ్రామిక ఉత్పత్తి 1938 ఉత్పత్తి కన్నా 40% పెరిగినదని ఆ ప్రకటన వెల్లడించినది.

### కమ్యూనిస్టుప్రతినిధులవేర్లప్రకటన

టోకియో, జులై 9: ఐక్యరాజ్యాల ప్రతినిధులూ, కమ్యూనిస్టు ప్రతినిధులూ కేసంగ్‌లో నిన్న సమావేశమై, జూలై 10 వ తేదీ మంగళవారంనాడు యుద్ధవిరమణగురించి రాయబారాలు ప్రారంభించడానికి నిశ్చయించారు. కేసంగులో నిన్న జరిగిన తొలిసంప్రతింపులు ఆద్యంతమూ సామరస్యంగా నడిచాయని ఐక్యరాజ్యసమితి సర్వసేనాని జనరల్ రిడ్జ్వే గతరాత్రి ఒక ప్రకటనలో తెలియజేశాడు.

మంగళవారంనాడు ప్రారంభమయే సంప్రతింపులకు ఇద్దరు ఉత్తర కొరియన్ సేనానులు, ఇద్దరు చైనీయ సేనానులు హాజరౌతారని వెల్లడించబడింది. ఆ నలుగురి పేర్లు ఇవి: జనరల్ నామ్ఇల్; మేజర్ జనరల్ లీస్యాంగ్ ఛో (ఉత్తర కొరియన్లు); జనరల్ టుంగ్ హూవా; జనరల్ హ్సియేఫాంగ్ (చైనీయులు) ఐక్యరాజ్య సైన్యాల తరఫున హాజరయే ప్రతినిధుల పేర్లు నిన్ననే ప్రకటించబడినాయి.

యుద్ధవిరమణ గురించి రాయబారాలు జరపటానికి, ఈ ఉభయ పక్షాల ప్రతినిధివర్గాలు జులై 10వ తేదీన కేసాంగ్ పట్టణం ఉత్తరభాగంలో వున్న ప్యాంగ్ ముక్ కొంగ్ వద్ద సమావేశం కావాలని నిశ్చయించబడింది.

ఐక్యరాజ్యాల ప్రతినిధి వర్గంలో లెఫ్టినెంట్ జనరల్ వాన్‌ఫ్లీట్ పేరు లేకపోవటం ఇక్కడివారికి విస్మయం కల్గించింది; వాన్‌ఫ్లీట్ ప్రతినిధివర్గానికి నాయకత్వం వహిస్తాడని మొదట అంతా అనుకున్నారు. కాని అందుకు విరుద్ధంగా ఆ పదవికి ఇప్పుడు అడ్మిరల్ జాయ్ నియమించబడ్డాడు. అయితే, అడ్మిరల్ జాయ్ దూరప్రాచ్యంలోవున్న అమెరికన్ మిలిటరీ ఉద్యోగులందర్లోకీ సీనియరు అనే విషయం గమనార్హం.

తొలి సంప్రతింపులు జరిపేనిమిత్తం కేసంగుకు వెళ్లిన ఐక్యరాజ్య సైన్యాల ప్రతినిధులు 3 గ్గురు ముగ్గురు ఈవేళ అపరాహ్ణం తిరిగివచ్చారు; నేటి ఈ సంప్రతింపులు 6 గంటలకుపైగా జరిగాయి.

**కొరియా పత్రిక హెచ్చరిక**

సింగపూర్, జులై 8: "యుద్ధ విరమణ ఒడంబడిక యథార్థంగా కుదిరేవరకు కొరియా ప్రజలు అప్రమత్తులై వుండాలి; అమెరికన్ సామ్రాజ్యవాదులు నిజంగా శాంతిని వాంఛించటం లేదు. ఈ గోముఖ వ్యాఘ్రాల పట్ల జాగరూకతతో మెలగటం ఆవశ్యకం," అని ఉత్తర కొరియా వార్తాపత్రిక నోడాంగ్ సిన్మన్ ఈవేళ హెచ్చరిక చేసినట్లు పెకింగు రేడియో ప్రకటించింది.

**కామన్వెల్తు సైన్యం అష్టమ సైన్యాల నాయకుల సమావేశం**

అష్టమసైన్యంలోని బ్రిటిష్ కామన్వెల్తు సైన్యాల సర్వసేనాని లెఫ్టినెంట్ జనరల్ సర్ హోరేస్ రాబర్ట్సన్ ఈవేళ విమానం మీద అష్టమసైన్య కార్యాలయానికి వెళ్లి, లెఫ్టినెంట్ జనరల్ జేమ్స్ వాన్‌ఫ్లీట్‌ను కలుసుకున్నాడు. వాన్‌ఫ్లీట్ అష్టమసైన్యానికి నాయకుడు.

జనరల్ రాబర్ట్సన్ రాకకు ప్రత్యేక ప్రాధాన్యం ఏమీలేదనీ, కొరియాలో యుద్ధవిరమణ ఒడంబడిక అంటూ కుదిరి ఒడంబడిక పత్రంమీద బ్రిటిష్ ప్రతినిధి సంతకం కూడా అవసరం అయితే, అందునిమిత్తం జనరల్ రాబర్ట్సన్ తన ప్రతినిధిని ఎవరినైనా పంపించగలడనీ, ఒక కామన్వెల్తు అధికారి వెల్లడించాడు.

**సమావేశానికి సన్నాహాలు సమాప్తి**

సియోల్, జులై 9; కేసు కేంగ్‌లో జరగబోయే యుద్ధవిరమణ సమావేశానికి సన్నాహాలు పూర్తి అయినాయి. యుద్ధవిరమణకు ఐక్యరాజ్యాలు విధించదలచిన షరతులేమిటో ఇంతవరకు బైటపడలేదు. సమావేశం మరో 24 గంటల్లో ప్రారంభం కాబోతున్నప్పటికీ, దక్షిణ కొరియా ప్రభుత్వం తన వైఖరిని యింకా నిర్ధారణగా తేల్చుకున్నట్లు కన్పించదు. కొరియాను అంతటినీ ఏకీకరిస్తేనేగాని యుద్ధవిరమణ తమకు సమ్మతం కాదంటూ అధ్యక్షుడు సింగ్మన్ రీ ఈ మధ్య ఒక ప్రకటన చేశాడు. కాని రాయబారవర్గంలో దక్షిణ కొరియా ప్రతినిధిని కూడా ఒకణ్ణి చేర్చటంతో పరిస్థితిలో కొంత మార్పు వచ్చింది.

అంతిమంగా దక్షిణ కొరియా ప్రభుత్వం 38 వ అక్షాంశరేఖను ...

(2 వ పేజీ చూడుడు)

## వ్యవసాయ, పారిశ్రామికాభివృద్ధికి ప్లానింగ్ కమీషన్ పంచవర్ష ప్రణాళిక

### 56 కల్లా ఆహారస్వయంసమృద్ధి: రాష్ట్రాలఉత్పత్తిగరిష్ఠప్రమాణాలు

న్యూఢిల్లీ, జులై 9: ప్లానింగు కమిషన్‌వారి ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా నేడు ప్రకటించబడింది. ఈ ప్రణాళికక్రింద దేశాభివృద్ధికి, వివిధ పథకాలక్రింద 1793 కోట్ల రూపాయల ఖర్చును కమిషన్‌వారు అంచనా వేశారు. ఇది రెండుభాగాలుగా వుంది. మొదటి భాగంక్రింది ఖర్చు అంచనా 1493 కోట్లు, రెండోభాగంక్రింద 300 కోట్లు, వచ్చే ఐయిదు ఏండ్లలోనూ, అభివృద్ధి పథకాలు చురుకుగా కొనసాగేందుకు వీలుగా ఈ రెండోభాగం సంతరింపబడింది.

ప్రణాళిక మొదటిభాగంలో వ్యవసాయాభివృద్ధికి, నీటిపారుదల సౌకర్యాలకు, విద్యుదుత్పత్తి కార్యకలాపాలకు ఉంచవలసింది గూడా గరిష్ఠప్రమాణం సహితంగా కమిషన్‌వారు ఇందులో నిర్దేశించారు.

ఇది సంపూర్ణంగా అమలు జరిగితే, 1955-56 నాటికి వస్తుసముదాయం యుద్ధాత్పూర్వ కాలంలోలాగాలభ్యం కాగల పావకోశం ఏర్పడుతుంది.

దేశం ఎన్నికష్టాలకైనా సరే తలఒగ్గి, ఎన్ని వ్యయప్రయాసలకైనా సరే భరించి, ప్రణాళిక ప్రథమభాగాన్ని అమలుజరపవలసి వుంటుందని, రెండోభాగాన్ని ఇతరత్రా ద్రవ్యం లభ్యమయ్యే పక్షంలో అమలుజరపవచ్చునని కమిషన్‌వారు తమ ఈ నివేదికలో ఉద్ఘాటించారు.

ఈ ప్రణాళిక వ్యవసాయం, నీటిపారుదల సౌకర్యాల ప్రాముఖ్యాన్ని నొక్కి వక్కాణిస్తున్నది. ఆహార సమస్యను గూర్చి కమిషన్‌వారు వెల్లడించిన తీవ్రభావం నీటి ప్రాముఖ్యాన్ని మరింత వెల్లడిచేస్తున్నది. ఏ యే రాష్ట్రం ఎంత ఎంత పంటను పెంచవలసింది గరిష్ఠ ప్రమాణంతో సహా కమిషన్‌వారు ఈ పథకంలో నిర్దేశించారు. ప్రణాళిక ప్రథమభాగంలో నీటిపారుదల సౌకర్యాల అభివృద్ధికి విద్యుదుత్పత్తికి గాను 451 కోట్ల రూపాయలు కేటాయించబడినాయి. ప్రాజెక్టుల నిర్మాణానికి గాను మొత్తం ఖర్చు 729 కోట్ల రూపాయలుగా లెక్కకట్టబడింది. ఈప్రాజెక్టులన్నీ పూర్తి అయితే 16.5 మిలియన్ల ఎకరాలు అదనంగా సాగులోకి రావడమేకాకుండా 2 మిలియన్ల కిలోవాట్లు విద్యుత్తుఉత్పత్తి అవుతుంది. వ్యవసాయోత్పత్తి యొక్క ప్రమాణాన్ని హెచ్చించాలన్నా, విద్యుచ్ఛక్తి ద్వారా అన్ని రకాలపరిశ్రమలను అభివృద్ధిలోకి తీసుకురావాలన్నా, ఈప్రాజెక్టులు అత్యవసరం. ఇవి నిర్మింపబడినప్పుడే ప్రజల జీవిత ప్రమాణాన్ని ఒక స్థాయిలోకి తీసుకు ...

వల్ల 1956 నాటికి 8.7 మిలియన్ల ఎకరాలు సాగవుతుంది. 1.1 మిలియన్ కిలోవాట్ల విద్యుత్తు ఉత్పత్తిఅవుతుంది. 7.2 మిలియన్ టన్నుల ఆహారధాన్యాల ఉత్పత్తి అవుతాయి. పెద్ద ప్రాజెక్టుల వల్ల 2.8 మిలియన్లు, చిన్న ప్రాజెక్టుల వల్ల 1.9 మిలియన్లు, భూసారాన్ని పెంచడంవల్ల 1.5 మిలియన్లు, ఎరువులవల్ల 0.6 మిలియన్లు, విత్తనాల పంపిణీ స్కీములవల్ల 0.4 మిలియన్లు, ఇతర స్కీముల వల్ల 0.5 మిలియన్లు పెంచాలని అంచనా వేయబడుతున్నది.

అయితే ఇదంతాజరగాలంటే రెండు ముఖ్య విషయాలు విధిగా పాటింపబడాలి. (1) ఈ పథకాన్ని అమలు జరిపేందుకు చేసే ఏర్పాట్లు గ్రామ గ్రామాన్ని గూడ దృష్టిలో వుంచుకు చేయబడాలి. భారీ ఎత్తున ఈ ప్రయత్నాలు కొనసాగాలి. (2) ప్రభుత్వం అనుసరించే ధరల విధానం పథకం లక్ష్యాలకు దీటుగా వుండాలి. ఈ పథకం జయప్రదం కావడానికి ప్రభుత్వం ధరల విధానం చాలా వరకు కారణం కాగలదని కమిషన్‌వారు భావిస్తున్నారు.

ప్లానింగు కమిషన్ పంచవర్ష ప్రణాళిక ప్రథమ భాగంలో వివిధములైన పద్దుల క్రింద అంచనాలు ఈ విధంగా వున్నాయి.

1951-52 మొదలు 1955-56 వరకు జాతీయ ప్రణాళిక మొదటిభాగం:

రూపాయలు లక్షలలో:

| విషయం | కేంద్రం | పార్టు 'ఏ' రాష్ట్రాలు | పార్టు 'బి' రాష్ట్రాలు | పార్టు 'సి' రాష్ట్రాలు | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. వ్యవసాయం; గ్రామీణాభివృద్ధి | 1804 | 12747 | 3793 | 826 | 19170 |
| 2. నీటి పారుదల సౌకర్యాలు; విద్యుత్తు | 17590 | 19160 | 7991 | 295 | 45026 |
| 3. రవాణాసౌకర్యాలు | 30969 | 5647 | 1637 | 567 | 38820 |
| 4. పరిశ్రమలు | 7538 | 1804 | 710 | 47 | 10099 |
| 5. సమాజ కార్యాలు | 5424 | 16025 | 2870 | 1089 | 25408 |
| 6. పునరావాసం | 7900 | — | — | — | 7900 |
| 7. ఇతరములు | 2176 | 579 | 100 | — | 2854 |
| మొత్తం: | 78400 | 59953 | 17100 | 2815 | 149277 |

(2-వ పేజీ చూడుడు)

## హైదరాబాద్ కాంగ్రెస్ వివాదాలపరిష్కారం

### ఎన్నికల కమిటీ నిర్మాణంపై ఉభయ వర్గాలమధ్య ఒడంబడిక

హైదరాబాదు, జూలై 9: ఎన్నికల సంఘ నిర్మాణం విషయంలో ఏర్పడిన వివాదయందు హైదరాబాదు ప్రదేశ కాంగ్రెసులోని ఉభయపక్షాలకూ ఒప్పందం కుదిరిందని కాంగ్రెసు కార్యదర్శి మోహన్‌లాల్ గౌతమగారు హైదరాబాదు అడ్‌హాక్ ప్రదేశ కాంగ్రెసుసంఘ ప్రత్యేక సమావేశం ముగిసీముగియంగానే ఈవాళ తెల్లవారుజామున రెండు గంటలప్పుడు వెల్లడించారు.

234 మంది సభ్యులతోకూడిన వెనుకటి అఖిలహైదరాబాదు కాంగ్రెసు సంఘాన్ని ఈనెల 31-వ తేదీనాడు సమావేశపరచడానికి నిశ్చయింపబడింది.

ఎన్నికల సంఘానికి ఎన్నుకొనవలసిన వారి సంఖ్యను ఆసమావేశం వారే నిర్ణయిస్తారు. ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుడే దానికిన్ని అధ్యక్షుడుగా ఉంటాడు. మూడింట రెండు వంతుల మెజారిటీ సంపాదించగలిగేవారందరూ ఎన్నికల సంఘానికి ఎన్నికైనట్లే ఎంచబడుతారు.

సంస్థాపన ఎన్నికల తేదీలను జనరల్ ఎన్నికలు పూర్తిఅయ్యేంతవరకూ ఆపియుంచవలసిందని ఈ సమావేశం వారు కాంగ్రెసు అధిష్ఠానవర్గం వారిని కోరారు.

**ప్రతికా ప్రతినిధులతో గౌతమ్ గోష్టి**

### ప్రదేశ కాంగ్రెసు ప్రత్యేక సమావేశం

హైదరాబాదు, జులై 9: అనుకొన్నప్రకారంగానే హైదరాబాదు ప్రదేశ కాంగ్రెస్ ఇవాళ సాయంత్రం 6 గం. షామంజిల్లాలో సమావేశం కానున్నది. ఉభయపక్షాల రాజీకి గౌతమ్‌గారు శక్తివంచనలేక కృషిచేస్తారు.

**టాండన్ హర్షం**

### అబిసీనియాలో కమ్యూనిస్టు కుట్ర?

## బ్రిటన్ రక్షణప్రయత్నాల వేగమాత్రం సడలించదు

### విదేశాంగ మంత్రి మారిసన్ ప్రకటన

### పత్రికల హర్తాళ్ వాయిదా

దేశబంధు గుప్తాగారి ప్రకటన

## జర్మనీతో శతృత్వం సమాప్తి: పశ్చిమ రాజ్యత్రయ ప్రకటన

**యూరప్ సైన్యనిర్మాణం: పశ్చిమ జర్మనీ కృషి**

## తూర్పు బెంగాల్ నుంచి హిందువుల వలసకు పాకిస్థానే కారణం

### నెహ్రూ-లియాఖత్ ఒడంబడిక సరిగా అమలుజరగడంలేదని 'జైన్' ఆరోపణ

కలకత్తా, జులై 8: భారత ప్రభుత్వ పునర్వసతి శాఖ స్టేట్‌మంత్రి శ్రీ ఏ. పి. జైన్ గారు ...

**బీహారు, పశ్చిమబెంగాలు సరిహద్దు ప్రాంతాలపై వివాద**

## అమెరికా, పసిఫిక్ రాజ్యాల పరస్పర సహాయపు ఒడంబడిక

### త్వరలో సంతకాలు జరుగుతవని న్యూజిలాండ్ ప్రధాని ప్రకటన

## గంటల పంచాంగం

ఖర సం॥ ఆషాఢ శు॥ షష్ఠి

1951 సం॥ జూలై 10 మంగళవారం

శుం॥ షష్ఠి రా 10-49 ఉత్తర తె 5-23 వర్జ్యం ప 11-51 ల 1-31 కు.

శు॥ సప్తమి జూలై 11 బుధవారం

శు॥ సప్తమి రా 10-40 హస్త 24-0 వర్జ్యం ప 1-55 ల 3-33 కు.


# ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరుఁడు,
యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము
పరమధర్మపథముల కెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ ఆషాఢ శు॥ షష్ఠి

మంగళవారం


## నెహ్రూ నివేదిక

గత నాలుగు సం॥లలో కాంగ్రెసు ప్రభుత్వము సాధించిన కార్యములను, ఇక సాధించవలసిన కార్యములను విశదీకరించుచూ భారత ప్రధాని పండిత నెహ్రూ, బెంగుళూరులో ఈ వారమున సమావేశము కానున్న అ. భా. కాంగ్రెసు సంఘము కార్యవర్గము పర్యాలోచన చేయు నిమిత్తము, ఒక నివేదికను తయారుచేసెను. ఈ నివేదిక కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికకు ప్రాతిపదిక కాగలదు. భారత ప్రభుత్వము నియమించిన ప్లానింగుకమిషను నివేదిక ప్రకటితమైనఅనంతరము కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక సిద్ధము కాగలదని ఇదివరకు తెలియజేయబడినది. పండితనెహ్రూ నివేదిక, ఎన్నికల ప్రణాళికకు ప్రాతిపదిక అయిన ఆయన నివేదికకు ప్లానింగుకమిషను నివేదిక ఆధారము గనుండునని ఊహించిన అసమంజసము కాదు. ఈ రెంటి ప్రచురణకు వ్యవధి నాలుగు రోజులు మాత్రమే.

పండితనెహ్రూ నివేదిక గతమునేగాక భవిష్యత్తునుగురించి కూడ చర్చించుచున్నది. ఇది గతములో చేయలేని దానిని అంగీకరించినది. చేయవలసిన దానిని ఉద్ఘాటించుచున్నది. ఇంతవరకు కాంగ్రెసు అభిలషించుచున్న ఆశయములకు, నేడు పండితనెహ్రూ తననివేదికలో పేర్కొనిన ఆశయములకు వైరుధ్యముగాని, విభేదముగాని లేదు. కేవలము, గతములో జరిగిన తప్పులను సవరించుకొని సాధించవలసిన కార్యములను గురించి పునః ప్రతిజ్ఞ, దీక్షపూనుటయే ఆయన దీర్ఘనివేదిక తాత్పర్యమని చెప్పవచ్చును.

కాంగ్రెసు యుద్ధానంతరము రాజ్యభారము వహించినది. యుద్ధకాలములో దేశ ఆర్థిక స్థితి చెడిపోయినది. ప్రభుత్వ యంత్రము చితికిపోయినది. రవాణా సౌకర్యములు తగిన స్థితిలో లేవు. ఉత్పత్తి తగ్గిపోయినది. దీనికి దేశ విభజనవల్ల కలిగిన దుష్ఫలితములు తోడయినవి. దేశములో ఎక్కడచూచినను అయోమయస్థితి ఏర్పడినది. ఈ పరిస్థితిలో దేశైక్యతా స్వాతంత్ర్యములు భగ్నము కాకుండ రక్షించుట పరమధర్మమైనది. పండిత నెహ్రూ చెప్పినట్లు ఒక అవాంతరముపోయి, మరొక అవాంతరమును ఎదుర్కొనుచు పరిస్థితిలో, అధునిక కాలమున ప్రజల వల్ల నిర్వర్తించవలసిన సాంఘిక, ఆర్థిక, రాజకీయ ధర్మముల భారమును వహించవలసివచ్చెను. దీనికి పాతపడి పాలనా యంత్రము సిద్ధముగ లేదు. అందువల్ల ఆ ధర్మములను సవ్యముగ నిర్వర్తింపలేకపోయెను. అయినప్పటికీ భవిష్యత్ జాతీయశ్రేయస్సుకు ఉపకరించు ఘనకార్యములను అనేకమును అరంభించినది. కాందిశీకుల పునరావాస కార్యక్రమము అమోఘఫలితముల నిచ్చినది.

అయితే ప్రధానమైన ఆర్థిక సమస్యను జయప్రదముగ ఎదుర్కొనలేకపోతినని పండిత నెహ్రూ అంగీకరించెను. ఈసమస్యను పరిష్కరించుటకు ఒక నిర్దుష్టమైన విస్పష్టమైన పథకముండవలెనని ఆయన దృఢ విశ్వాసము. ఆవిధమైన పథకమున్నగాని విస్పష్టమైనకార్యక్రమము ఏర్పడజాలదు.

ఆ పథకము మనము అభిలషించు ఆశయములను అనుసరించి, ఆ ఆశయములను సాధించుటకు ప్రయోగించు సాధనములబట్టి యుండగలదు. మనము అభిలషించు ఆశయము ఏది. మనసంఘమునకు ఎవ్విధమైన రూపమివ్వదలచితిమి? దానికి పండితనెహ్రూ ఈ విధముగ సమాధానమిచ్చెను. "సామ్యవాదము యొక్క ప్రధాన లక్షణములుగల ప్రజాసత్తాకమును సాధించవలెను. అప్పుడు మనకు రాజ్యాంగములోయున్న లక్ష్యమును, కాంగ్రెసు కోరిన సహకార ప్రజాస్వామ్య ఆశయమును, సిద్ధించగలవు." అయితే వీటిని సాధించుటలో రాజ్యాంగము చేత అంగీకృతమైన పద్ధతులనే అనుసరించవలెనని (అవసరమైతే రాజ్యాంగమును సవరించవచ్చును.) ఆయన విస్పష్టము చేసెను. మరి ఏ ఇతర మార్గమును అవలంబించినప్పటికీ ప్రమాద భూయిష్ఠము. పరిస్థితిని గమనింపక త్వరపడిన సంఘర్షణలకు దారితీయును. అయితే స్తబ్ధత్వము ప్రమాద భరితము. కాబట్టి మధ్యేమార్గము అవలంబించవలెను. ఆ మార్గమును కనిపెట్టవలెను.

ఈ మార్గమును గురించి పండిత నెహ్రూ ఇంత నొక్కి చెప్పుటలో ఔచిత్యమున్నది. భారత స్వాతంత్ర్య సమరము యొక్క ఉత్కృష్టత ఆ సందర్భమున ఉపయోగింపబడిన సాధనము. సాధనము, ఆశయము పరస్పర విరుద్ధము కాకపోవుటే దాని ప్రాశస్త్యము. గాంధీజీ భారత దేశమునకు తద్వారా ప్రపంచమునకు ప్రసాదించిన సిద్ధాంతము అదే. ఆశయ మెంత పవిత్రమో, సాధన మార్గముకూడ అంత పవిత్రముగ నుండవలెను. ఇది మనస్సునందుంచుకొనియే పండిత నెహ్రూ అవలంబించవలసిన మార్గములకు ప్రాముఖ్యత నిచ్చియుండవచ్చును. అందువల్లనే ప్రజల ప్రాథమిక అవసరములను తీర్చుటకు కమ్యూనిస్టు సిద్ధాంతము, తిరస్కారయోగ్యముగ కనుపడినప్పటికి, ఆ సిద్ధాంతము, సంఘర్షణ, దౌర్జన్యము, వ్యక్తి స్వాతంత్ర్య నిర్మూలనము, మొదలైనవాటికి దారి తీయు కలదు. "కాబట్టి ఆర్థిక శ్రేయస్సును, అభివృద్ధిని, వ్యక్తి స్వాతంత్ర్యమునకు భంగము రాకుండ సాధించవలెను. అదే శ్రేయోరాజ్యము. ఈ శ్రేయోరాజ్యములో నియంతృత్వమునకు దానికి ఆస్కారము లేదు. నియంతృత్వము నివారించవలెననిన, నిర్బంధమైన ఆర్థిక వ్యాపారమునకు అనకాశము లేదు. ప్రణాళికాబద్ధమైన ఆర్థిక విధానము ఏర్పడవలెను. అనగా నియమబద్ధమైన ఆర్థిక విధాన మేర్పడవలెను. వ్యక్తి స్వాతంత్ర్యమునకు భంగము రాకుండ, ఆర్థిక శ్రేయస్సును, అభివృద్ధిని సాధించి, నియమబద్ధమైన ఆర్థిక విధానమును ఆకాంక్షించుటయే పండితనెహ్రూ చెప్పిన మధ్యేమార్గము. అదే ప్రజాసత్తాక మార్గము. అదే శ్రేయోరాజ్యము. బెంగుళూరులో కాంగ్రెసు సంఘసమావేశము, ఈ ఆశయమునకు తగిన కార్యక్రమమును రచించి, దానిని అమలు జరుపుటకు కాంగ్రెసు ప్రభుత్వములకు అవసరమైన పుష్టిని, ప్రతిభను, ఉత్సాహమును కలుగజేయుదురుగాక.

## మైసూరులో పండిత నెహ్రూ

### కేంద్ర ఆహార పరిశోధన సంస్థ పరిశీలన

మైసూరు, జూలై 8: ప్రధానిపండిత నెహ్రూగారు తిన కుమార్తె ఇందిరా గాంధి, పార్లమెంటరీ కార్యదర్శి సత్యనారాయణ సిన్హాగారలతో సహా నేడు ఇచ్చటికి వచ్చినప్పుడు స్థానిక మునిసిపల్ కౌన్సిలుసభ్యులు వారికి సుస్వాగతమొసంగి పుష్పహారములు వేసిరి. తర్వాత వారు 5 మైళ్ల దూరమునున్న లలితమహాలుకు కారులో వెళ్ళిరి. పండితుని దర్శింప ఆతురతచెందుచుండిన జనసమూహములు ఈ 5 మైళ్ల పొడుగున త్రోవకిరుప్రక్కల నిల్చి జయ జయ ధ్వానములు సాగించుచుండిరి. లలితమహాలువద్ద మైసూరు మహారాజు స్వయముగా పండిత నెహ్రూకు స్వాగతమొసగెను. మహారాజు అంగరక్షక దళము గౌరవాభివందనముగా నిలచిరి. తర్వాత పండిత నెహ్రూ గారు నగర కాంగ్రెసు కమిటీవారు ప్రభుత్వ భవనమునందలి పచ్చిక బయలులో చేసిన అల్పాహారవిందులో పాల్గొనిరి.

తర్వాత పండిత నెహ్రూగారు మహారాజుగారితో సహా కేంద్ర ఆహార పరిశోధన సంస్థకు వెళ్లి అచ్చట 90 నిమిషములు గడిపెను. అచ్చట జరుగుచున్న పరిశోధనలలో పండితుడు చాలా శ్రద్ధ కనబరిచెను. ప్రస్తుత ఆహారకొరతను తొలగించుటకు పరిశోధన సంస్థ యేమైన చేయగలిగెనా? అని పండిత నెహ్రూగారు డైరెక్టరు సుబ్రహ్మణ్యంగారి నడుగగా ఆహార కొరతను తొలగించుటకు కఱ్ఱపెండలమును ఎట్లు ఉపయోగించుకొనవచ్చునో ఆయన వివరించి చెప్పెను. కృత్రిమ బియ్యమును తయారుచేయుటకు సంస్థలో జరిగిన ప్రయోగములు ఫలప్రదమయ్యెనని ఆయన చెప్పెను.

అనంతరము ప్రధాని కృష్ణసాగరము వద్దనున్న బృందావన ఉపవనమును వీక్షించిరి.

## చిత్తూరు-గూడూరు మధ్య బ్రాడ్‌గేజ్ లైను

### వేయవలసిందిగా రాయలసీమ అభివృద్ధి సంఘంవారి సూచన

తిరుపతి, జులై 7: చిత్తూరు-గూడూరులకు మధ్య ఇప్పుడున్న మీటర్‌గేజ్ రైలుమార్గం స్థానంలో బ్రాడ్‌గేజ్ రైల్లు వేయవలసిందిగా నిన్న నగరిలో జిల్లా కలెక్టరు ఎ. రామచంద్రన్‌గారి అధ్యక్షతను సమావేశమైన రాయలసీమ అభివృద్ధి సంఘంవారు రైల్వే అధికారులను కోరుతూ ఒక తీర్మానం చేశారు. మద్రాసురాష్ట్రంలోని వుత్తర దక్షిణ భాగాలను కలిపే యీముఖ్యమైన రైలుమార్గాన్ని బ్రాడ్‌గేజ్‌గా చేయటం చాలా అవసరమని సభవారు తెలియచేశారు. ప్రఖ్యాతి పుణ్యతీర్థమైన తిరుపతికి కూడా బ్రాడ్‌గేజ్ లైను వేసి రేణిగుంటవద్ద బొంబాయి-మద్రాసు లైనులో కలుపవలసిందిగా కూడా కోరారు. కాట్పాడి, పలమనేరి, కోలారు-బెంగుళూరు, కుప్పమ్-పలమనేరి, మదనపల్లి-ధర్మవరం మార్గాలలో కూడా బ్రాడ్‌గేజ్ లైను వేయవలసిందిగా రైల్వే అధికారులను కోరుతూ మరొక తీర్మానంచేశారు.

## విశాఖ పురపాలక సంఘం

విశాఖపట్టణం, జులై 7: ఈ పురపాలక సంఘంలో కెప్టెన్ టి విశ్వనాథంగారిచ్చిన రాజీనామా ఫలితంగా ఏర్పడ్డ ఖాళీలో పూళ్ల రామారావు గారు పోటీ లేకుండా ఎన్నికైనారు.

## తిరుపతికి మవ్‌లంకర్‌గారి రాక

తిరుపతి, జులై 7: భారత పార్లమెంటు స్పీకరు జి. ఎ. మవ్‌లంకర్ గారు యిక్కడకు యీ నెల ఆఖరు వారంలో రానున్నట్లు తెలుస్తున్నది.

## మదనపల్లి పరిసరాల్లో వర్షం

మదనపల్లి, జులై 7: గడచిన రెండు రోజులనుంచీ యీ ప్రాంతంలో విస్తారమైన వర్షం కురిసింది. ఇప్పటి యీ వాన సేద్యానికి చాలా సహాయకారి. మెట్ట గ్రామములలో విత్తులు వేయ నారంభించారు.

# ప్లానింగ్ కమీషన్ పంచవర్ష ప్రణాళిక

## 1-వ పేజీ తరువాయి

### ప్రాథమిక విషయాలు

ఈ ప్రథమ భాగంలో ప్రాథమికమయిన విషయాలుగా ఈక్రిందివి పేర్కొనబడినాయి:

(1) పునరావాసం మొదలైనకార్యక్రమాలను, అంటే ఇప్పుడు నిర్వహణలోవున్న వాటిని పూర్తిచేయాలి.

(2) అనతికాలంలో ఆహారం, ముడిపదార్థాల ఉత్పత్తిని పెంచాలి.

(3) భౌతిక, సాంకేతిక సంపదల అభివృద్ధికి అవసరమైన స్కీములను అమలు జరపాలి. ఉద్యోగ సావకాశాలను పెంపొందించాలి.

(4) సమాజ సౌకర్యాల విషయంలో ఇంతవరకు నిర్వహించిన కార్యక్రమాన్ని సమూహపరచి,అది ఇంకా విస్తృతం అయ్యేట్లు చూడాలి.

(5) వెనకబడివున్న రాష్ట్రాల అభివృద్ధిని దృష్టిలో వుంచుకొని, పరిపాలక, సామాజిక కార్యకలాపాలను ఇతోధికంగా ఒనగూర్చుకొని, అవి త్వరగా వృద్ధిలోకి వచ్చేటట్లు చూడాలి.

కమిషన్ ఈ పథకంలో అన్ని అంశాలను దీర్ఘంగా సూచించి వదిలి పెట్టారు. ఒక ప్రజాస్వామ్య రాజ్యంలో ప్లానింగు అన్నది ఒక సామాజిక వ్యవహారం. అందులో ప్రతిఒక్క పౌరుడికి పాల్గొని నిర్వహించగల సావకాశం వుంటుంది. భవిష్యదభివృద్ధికి మార్గాలను నిర్దేశించడం అన్నది గురుతరమైన కార్యం. దేశంలో అందరి అభిప్రాయాలను స్వీకరించిన అనంతరం దీనికి ఒక సమగ్ర రూపాన్ని చేకూరుస్తాం. అప్పుడు దీనిని అమలు జరపడంలో ప్రతి పౌరుడు సహకరించ గలడని, దేశంయొక్క హితంకోసం ఈ పథకం ఆధారంగా కష్టించగలడని ఆశిస్తున్నాం అని కమిషన్‌వారు అన్నారు.

రాజ్యాంగంలోని లక్ష్య సూత్రాలను ఆధారంగా తీసుకొని ప్లానింగు కమిషన్‌వారు ఈ పథకాన్ని రచించారు. సమాన అవకాశాలు, సమాజ న్యాయం, పని చేసేందుకు, తగిన వేతనాన్ని సంపాదించుకునేందుకు, అందరికి హక్కులు, అందరికి సమాజభద్రత వుండగల ఆర్థిక సామాజిక ధర్మాన్ని స్థాపించాలని రాజ్యాంగంలోని ఈ సూత్రాలు నిర్దేశిస్తున్నాయి. ఇక ఈ పథకం అమలు జరగడంవల్ల ఈ ఆశయాలు, సమాజంయొక్క నిర్మాణ కృషి కొత్త పుంతలలో కార్యోన్ముఖాలు అయితే ఇది జయప్రదం అవుతున్నట్లు తేలుతుంది.

### ప్లానింగు ప్రజాస్వామ్యం

ప్రజాస్వామ్య దేశాలలో ప్రభుత్వం ఇట్టి కార్యక్రమ ప్రణాళికలకు దిగి, వాటిని అమలుజరుప చూస్తున్నదంటే, అందుకు ప్రజల సహకారం, మద్దత్తు ఎంతో అవసరం. ఇట్టి పథకాలకు నిజమైన ఉద్దీపనం, బలం, ఈ మద్దత్తు ఈ సహకారాలే. ఒక టోటలిటేరియన్ దేశంలో అయితే ప్లానింగు అన్నది కేంద్రాధికార వర్గంచేతుల్లో వుంటుంది. ఆ అధికారవర్గం సర్వాధికార సంపన్నం అయినదిగా వుంటుంది. అట్టి సందర్భాలలో పథకాలను అమలు జరపడం తేలిగ్గా ఫలితాలను చూపించడం కష్టమైనపని ఏమీ కాదు. కాని టోటలిటేరియన్ పద్ధతిని అవలంబించినందువల్ల మూల సత్త్వాలను ఎన్నిటినో వదలుకోవలసివుంటుంది. ఫలితాలు తొందరలో కల్గుతున్నట్లు కన్పించినా అవి సాధింపబడిన పరిస్థితులునిష్ఠురంగా వుంటాయి. బాధలు, కష్టాలు అమితంగావుంటాయి. ఈ కష్టం ఈ నిష్ఠురం, అంతా సమంగా పంచుకొని పనిచేస్తారనడానికి వీలు లేదు. ఏమైనా ఆర్థికాభివృద్ధి అనగా వేకొంత త్యాగం చేయవలసిన అవసరం వుంది. ఈ అవసరం టోటలిటేరియన్ రాజ్యంలో ఒక రకంగానూ, ప్రజాస్వామ్యంలో మరొరకంగానూ వుంటుంది. ఇక భేదం అల్లా ఎక్కడ వుంటుం దంటే టోటలిటేరియన్ రాజ్యంలో అంతా బలవంత ప్రాబల్యార్ధంగా వుంటుంది; ప్రజాస్వామ్యంలో స్వచ్ఛందంగా ప్రజలు ప్లానింగుయొక్క అవసరాన్ని, ఆదర్శాన్ని గుర్తించి త్యాగం చేస్తారు. ఇట్టి మార్గంలో సాధించిన అభివృద్ధి సౌష్ఠవంగానూ, స్థిరంగానూ వుంటిపోతుంది. ప్రజాస్వామ్య మార్గంలో ప్లానింగుకు దిగడం అంటే కష్టమైన మార్గాన్ని ఎంచుకోవడం. అయితే, దగ్గరదారులకోసం ఇట్టి విషయాల్లో తిరుగులాడటం ఎప్పుడూ, ఎన్నడూ మంచిది కాదు.

### వ్యష్టి వ్యవహారం

దేశంయొక్క ఆర్థికాంగాన్ని కేంద్రీకృతం చేయాలని అందులో ప్రభుత్వాలు ముఖ్యపాత్ర వహించాలని కమిషన్‌వారు సూచించారు. ఐతే ఇందులో వ్యష్టి వ్యవహారాలకు స్థానం అంటూ లేకుండాపోదు. అది ఒక కొత్త పాత్రను వహించాలి. దేశహితంకోసం ఒక కొత్త దృక్పథాన్ని అలవరుచుకోవాలి. అన్ని వ్యవస్థల లాగే, వ్యష్టి వ్యవస్థలు కూడా వాటి ప్రయోజనాన్ని, ప్రజా శ్రేయస్సుకు ఉద్దేశించిన పరిధిలో పర్యవసింప చేసుకుంటే అవి బ్రతకనేర్చుగాక, జీవించినుకూడా జీవించగలుగుతాయి. ప్రజా శ్రేయస్సుకు అవి ఎన్నడు ఉపకారాలు కాకుండా ఆటంకాలో అవాంఛనీయమో అయిందా వాటిపని పరిపోతుంది. ఈ

పాను అమలు జరుగుతూ వున్నంతకాలం ప్రభుత్వం సర్వ సంపదలను వ్యవసాయం, నీటిపారుదల సౌకర్యాలు, విద్యుదుత్పత్తి మొదలైన కార్యకలాపాల కోసం సమీకరించి వినియోగిస్తూ వుంటుంది కాబట్టి, పరిశ్రమలలో భారీఎత్తున పెట్టుబడులు పెట్టడం దానికి సాధ్యంకాదు. ఒక వేళ ఏమన్నా పెట్టగల్గినా, అత్యవసరంగా నెలకొల్పవలసిన కొత్త పరిశ్రమలకుగానున్నూ, ప్రస్తుతం తన క్రిందవున్న పరిశ్రమల అభివృద్ధినిమిత్తమున్నూ వినియోగించవలసివుంటుంది. అందువల్ల పారిశ్రామికోత్పత్తిలోను, పంపిణీలోను వ్యష్టి వ్యవహర్తలకు మంచి సావకాశం వుండనే వుంటున్నది. అయితే ప్రభుత్వం ఈ పెట్టుబళ్లను కంట్రోలు చేస్తుంది; విదేశీ వ్యాపారాన్ని క్రమబద్ధం చేస్తుంది; విదేశీ చలామణిని పొదుపుచేస్తుంది; ఆర్థికాంగం అన్నది ఒక్కటే మార్గం. ఇందు ప్రభుత్వ వ్యవహారం, వ్యష్టి వ్యవహారం, ఈ రెంటికి సంబంధించిన పథకాలు, ఆధార ఆధేయభావం కల్గినవై వుండాలి. ఈ దృష్టితో ప్లానింగు కమిషన్ వ్యష్టి పరిశ్రమలలో ముఖ్యమైన వాటికి సంబంధించి సంతివరకు ఆ పరిశ్రమల ప్రతినిధులతో సంప్రదించి కార్యక్రమ ప్రణాళికలను తయారు చేసింది. తక్కిన పరిశ్రమలకు గూడా ఇట్లాగే తయారు చేస్తుంది.

### వ్యవసాయానికి ప్రాముఖ్యం

పంచవర్ష ప్రణాళిక వ్యవసాయానికి, నీటి పారుదల సౌకర్యాలకు అత్యంత ప్రాముఖ్యాన్ని ఇస్తున్నది. ప్లానింగు కమిషనువారు ఆహార సమస్యను గూర్చి వెల్లడించిన ఆతురతాభావం ఈ ప్రాముఖ్యాన్ని మరింత ఇనుమడింప జేస్తున్నది. 1950 లో లాగా 13.67 ఔన్సు చొప్పున మనిషి ఒకనికి ధాన్యం అవసరమని లెక్కచేసి, 1956 నాటికి సంభవించే జనాభా పెరుగుదలను గూడా గణిస్తే అప్పటికి 6.9 మిలియన్ టన్నుల ధాన్యాన్ని అదనంగా దేశంలో పండించాలి. కాని ఈవ్యక్తి ఆహారాన్ని 14,15 లేక 16 ఔన్సులకు పెంచితే, అదనపు పంటవరుసగా 8.2,12, 15.8 మిలియన్ టన్నుల దాకా పెరగాలి. ఈ రెండు అంకెలను చూస్తే, ఈ 5 ఏండ్లలోను ఆహార స్వయం సమృద్ధికి ఎంత ప్రయత్నం చేయవలసి వుందో వ్యక్తం అవుతూనే వుంది. ఈ అదనపు పంటను ఎట్లా సాధించ వలసింది ప్లానింగు కమిషన్‌వారు రాష్ట్రం వారీగా గరిష్ఠ ప్రమాణ సహితంగా లెక్క కట్టి ఈ విధంగా తేల్చారు:—

అంకెలు వేలల్లో:

| రాష్ట్రం | ఆహారం | జనపనార (బేళ్లు) | ప్రత్తిబేళ్లు | నూనె గింజలు టన్నులు | పంచదార టన్నులు |
|---|---|---|---|---|---|
| అస్సాం | 311 | 440 | — | — | — |
| బీహారు | 819 | 390 | — | 8.5 | 50 |
| బొంబాయి | 367 | — | 168 | 63.0 | 84 |
| మధ్యప్రదేశ్ | 817 | — | 128 | 27.0 | — |
| మద్రాసు | 8.4 | — | 218 | 142.0 | 78 |
| ఒరిస్సా | 295 | 200 | — | — | — |
| పంజాబు | 650 | — | 79 | — | 57 |
| యు. పి. | 800 | 330 | 46 | 61.0 | 410 |
| ప. బెంగాలు | 797 | 700 | — | — | 11 |
| హైదరాబాద్ | 633 | — | 88 | 49.0 | — |
| మధ్యభారత్ | 300 | — | 91 | 9.5 | — |
| మైసూర్ | 179 | — | 75 | — | — |
| పెప్సు | 249 | — | 56 | — | — |
| రాజస్థాన్ | 86 | — | 75 | — | — |
| సౌరాష్ట్ర | 94 | — | 109 | 15.0 | — |
| కొచ్చిన్-తిరువాన్కూరు | 141 | — | — | — | — |
| ఇతర రాష్ట్రములు | 260 | — | 17 | — | — |
| వెరసి | 7202 | 2060 | 1200 | 375.0 | 690 |

డబ్బుపంటల విషయంలో నిర్మాణక్రమమైన అభివృద్ధి ప్రస్తుత అనుకూల పరిస్థితులలో కొనసాగుతూనే వుంటుందని ఈపరిస్థితి ఇట్లాగే కొంతకాలంపాటు కొనసాగగలదని కమిషన్‌వారు ఆశిస్తున్నారు. అయితే, ఆహారపు పంటల అభివృద్ధి విషయంలో రైతుకు సహాయకారిగా వుండేటట్లు తగినచర్యలు అవలంబించవలసి వుందని హెచ్చరించారు. ఇది కొనసాగడానికి ప్రభుత్వం ధరలవిధానం ఒడుదుడుకులు లేకుండా వుండాలని జనపనార పత్తి, నూనె గింజలు మొదలైన డబ్బుపంటల ధరలు పెరగకుండా చూడాలని, కాకపోతే ఈ పంటల పెంపకంలో పోటీలువచ్చి, పథకం అనుకున్నవిధంగా కొనసాగక పోవచ్చునని కమిషన్‌వారు పేర్కొన్నారు. అదీకాక కొన్నిపంటల ధరపెంచి ప్రోత్సాహాన్ని ప్రకటించడం గూడా తగదని కమిషన్‌వారు సూచించారు. అట్టి పెంపుదలవల్ల రైతులు ఆపంటలకు పూనుకొని, తక్కిన పంటలపట్ల ఔదాసీన్యం వహించడం జరుగుతుందని హెచ్చరించారు.

### పరిశ్రమల పథకం

పరిశ్రమల విషయంలో ప్లానింగు కమిషన్‌వారు ఇంతవరకు సాధించిన అభివృద్ధిని వివరించి, ముందు విజ్ఞానంగా లక్ష్యసూత్రాలుగా వుండవలసిన ఆదర్శాలను ఈ పథకంలో పేర్కొన్నారు.

(1) వ్యవసాయానికీ వ్యక్తి నీటి పారుదల సౌకర్యాల అభివృద్ధి స్కీములకు అవసరమయ్యే వస్తువులను తయారు చేయాలి. (2) జనపనార, బట్టలు, పంచదార, సబ్బు నూనెలు ఉత్పత్తిని మిల్లులు తమశక్తి మేరకు పెంచాలి. (3) ఉక్కు, ఇనుము, మొదలైన ముఖ్య పరిశ్రమలు తమ ఉత్పాదన శక్తిని విస్తృతం చెయ్యాలి (4) పెట్టుబడి పెట్టి పూర్తి కాకుండా మిగిలి వున్న కర్మాగారాల నిర్మాణాన్ని పూర్తిచేయాలి. (5) ప్రస్తుతం పరిశ్రమలలోవున్న లోపాలను పరిహరించాలి. ఈ ఆశయాలను దృష్టిలో వుంచుకొని కమిషన్‌వారు ముఖ్యమైన పరిశ్రమలకు ఉత్పత్తి ప్రమాణాలనిశ్చయించారు. కమిషన్‌వారు ముఖ్యంగా 18 పరిశ్రమలను పేర్కొని వాటిఅభివృద్ధికి అదనంగా కావలసిన పెట్టుబళ్లను 125 కోట్ల రూపాయలుగా లెక్కకట్టి, ప్రభుత్వం వాటికి అవసరమైన ఆర్థిక సహాయాన్ని చేయవలసిందిగా గూడా సూచించారు. అల్పపరిశ్రమల విషయంలో ప్రభుత్వం తాలూకు పరిశ్రమలశాఖలన్నీ, వాటికి తోడ్పడాలని, ఇప్పుడువున్న అల్పపరిశ్రమల అభివృద్ధికి కొత్త పరిశ్రమల స్థాపనకు పథకాలు వేయాలని కమిషన్‌వారు సూచించారు. భారీ పరిశ్రమలకు, అల్పపరిశ్రమలు అనుబంధాలుగా వుండేటట్లు చూడాలని అందుకు ఒక పథకం అవసరమని కమిషన్‌వారు సూచించారు. పరిశ్రమల అభివృద్ధికి విదేశీ పెట్టుబళ్లు రావడం అవసరమని, అందువల్ల, పెట్టుబడి వస్తువులు త్వరగా లభించే సావకాశం వున్నదని వారు భావిస్తున్నారు.

### పారిశ్రామిక కోత్పత్తికి ప్రమాణాలు

పరిశ్రమలలో ముఖ్యంగా ఇప్పుడు వున్న పరిశ్రామికులే వేతను ఉత్పత్తిని ఏ విధంగా పెంచవలసింది, ఆ పెంచవలసిన ప్రమాణం ఎంత మొదలైన విషయాలను ప్లానింగు కమిషన్‌వారు ఈ పథకంలో నిర్దేశించారు.

వేల టన్నుల్లో:

| పరిశ్రమ | 1950-51 | 1955-56 |
|---|---|---|
| ఉక్కు | 1005 | 1315 |
| సిమెంటు | 2613 | 4600 |
| కాగితం; | | |
| కాగితంబోర్డు | 109 | 165 |
| న్యూస్ ప్రింటు | — | 24 |
| ఉప్పు | 2622 | 3.75 |

వస్త్రోత్పత్తి విషయంలో మిల్లులు తమ శక్తిమేరకు పనిచేసి నట్లయితే, 4500 మిలియన్ల గజాల గుడ్డను ఉత్పత్తి చాయగలవు.చేనేత మగ్గాలమీద తయారయ్యే గుడ్డ 1900 మిలియన్ల గజాలు ఈఉత్పత్తి సక్రమంగా కొన

సాగితే 1955-56 నాటికి దేశంలో మనిషికి 15 గజాల గుడ్డ లభ్యం అవుతుంది. ఈ లెక్కను ప్లానింగు కమిషన్‌వారు ఎగుమతికి కావలసినదాన్ని మినహాయించే వేశారు. ఇట్లాగే పంచదార ఉత్పత్తికిగూడా ప్రమాణాన్ని కమిషన్‌వారు నిశ్చయించారు.

### రవాణా సౌకర్యాలు

రవాణా సౌకర్యాలక్రింద ఎక్కువ ఖర్చు రైలురోడ్లకుగాను కమిషన్‌వారు అంచనావేశారు. ఈ మొత్తాన్ని కొత్త రోడ్లు వెయ్యడానికి కాక,వున్న వాటిని బాగుచేయడానికి,వున్న లోపాలనుసవరించడానికి వినియోగిస్తారు. ప్రణాళిక రెండోభాగంలో కొత్త స్కీములకు సావకాశం వుంది. మామూలు రోడ్ల విషయంలోగూడా ప్లానింగు కమిషన్‌వారు వున్న రోడ్లలో లోపాలేమున్నావుంటే వాటిని సర్దుబాటు చేయాలని నిర్దేశిస్తున్నారు. ప్రస్తుతం నిర్వహింపబడుతూవున్న అభివృద్ధిని మాత్రం పాలిస్తూ వుండాలని సూచించారు. పారిశ్రామిక ప్రాంతాలలో గృహనిర్మాణానికి, పట్టణాల లో తక్కువతరగతుల ఉపయోగార్థం గృహనిర్మాణానికి 50 కోట్ల రూపాయలు అంచనా వేశారు. విద్యా విధానం, ప్రజారోగ్యం, కార్మిక సంబంధాలు మొదలైన అంశాలను గూర్చి గూడా కమిషన్‌వారు ఈ నివేదికలో తమ సూచనలను పొందుపరిచివున్నారు.

ఈ పథకం అమలు జరగడానికి అవసరమైన ధనం ఎట్లా సమూపార్జింపబడుతుందో గూడా కమిషన్‌వారుఈనివేదికలోఉటంకించారు. కేంద్రప్రభుత్వం ఏటా ఆదాయం ఖాతాలో 26 కోట్ల మిగులును చూపాలి. రాష్ట్రాలకు ఈ 5 ఏండ్లలో పన్నుల మూలంగాఆదాయం హెచ్చుతుంది. స్థానికంగారు అప్పులు గూడాతీసుకుంటారు. ఈ విధంగా ఒక 213 కోట్ల రూ లభించే సావకాశం వుంది. ప్రజలవద్ద దీర్ఘకాలిక పద్ధతుల మీద కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు తీసుకొనే అప్పులవల్ల మరో 115 కోట్లు వస్తాయి. స్వల్పమైన ఆదాయపు నిల్వలు అవ్వకలిసి మరో 250 కోట్లు చేరుతవి. రక్షణ మొదలైన శాఖల్లో వ్యయాన్ని కొంత నియమించడంవల్ల మరికొంత తేలుతుంది. ఈ విధంగా కేంద్రము, రాష్ట్ర ప్రభుత్వాలూ కలిసి 1121 కోట్లు ఈ పథకాన్ని అమలు జరపడానికి సమపార్జించ గల్గుతాయి. పోతే ఇతర మార్గాల ద్వారా 672 కోట్లు సంపాదించవలసివుంది. కొలంబో పథకం క్రింద కెనడా ఆస్ట్రేలియాలు ఇండియాకు చేసే సహాయం అప్పుగా యిచ్చే ఆహార ధాన్యాలు, ఇందులో కొంతభాగాన్ని చేకూరుస్తాయి. ప్లాను అమలు జరుగుతూవున్న కొద్దీ ఇతర దేశాల నుంచి అప్పులు లభించవచ్చు.

లండన్, జూలై 8: న్యూ స్టేట్స్‌మన్ అండ్ నేషన్ పత్రికా సంపాదకుని కేసులో జరిగిన సంప్రతింపుల గురించి ఇంతవరకు ఒక్క ముక్కకూడా ప్రకటించలేదు.

## కాశ్మీర్ ప్రధానితో మధ్యవర్తిసంభాషణలు

శ్రీనగరు, జూలై 8: కాశ్మీరు సమస్యా పరిష్కారమునకై ఐక్యరాజ్యసమితిచే మధ్యవర్తిగా నియమింపబడిన డా॥ ఫ్రాంకు గ్రాహాం గారు నేడుదయము శ్రీనగరుకు విచ్చేసిరి. కాశ్మీర్ ప్రధాన మంత్రియగు షేకుఅబ్దుల్లాగారిని మర్యాద లాంఛనముగా నేడు సందర్శించి సుమారు 45 నిమిషములసేపు ఇష్టాగోష్ఠిగా మాట్లాడిరి. గ్రాహాంగారి వెంటనున్న ప్రచురణోద్యోగియగు ఫిలిప్పి డెస్టెరో గారు పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ కాశ్మీరు మధ్యవర్తికి స్థిరమైన కార్యాలయము ఉండదన్నారు. డా॥ గ్రాహాంగారు ఇండియా ప్రభుత్వముతోను, పాకిస్థాన్ ప్రభుత్వంతోను సంప్రతించి మాట్లాడుతూ ఉండాలి గనుక ఎక్కడికి అవసరమైతే అక్కడికి వెళ్లుతూ ఉండాలి గనుక స్థిరమైన కార్యస్థానం ఉండదు. కాశ్మీరు ప్రధాని షేకుఅబ్దుల్లా గారితో నేటి సాయంకాలము మాట్లాడిన పిమ్మట కాశ్మీరులో డా॥ గ్రాహాం గారి కార్యక్రమము నిర్ధారణ చేయబడును.

## యుద్ధ విరమణ సంప్రదింపులు

(1-వ పేజీ తరువాయి)

కాధికారులు ఉత్తరువు చేశారు. కాని ఎదిరిపక్షం పత్రికా ప్రతినిధులను రానిస్తే, తాము తమ వైపు వారిని రానిస్తామనీ, వారితో సమానంగా వీరికిసౌకర్యాలు కల్పించబడతాయనీ బ్రిగేడియర్ ఫ్రాంక్ ఆలెన్ వాగ్దానం చేశాడు.

సేవూల్, జూలై 9: కమ్యూనిస్టులతో యుద్ధవిరమణ సంప్రతింపులు జరపటానికి నియమించబడిన ఐక్యరాజ్య రాయబారవర్గ సభ్యులు అయిదుగురు విమానాలమీద ఈ వేళ సేవూల్ చేరుకున్నారు.

అడ్మిరల్ జాయ్ మొదలుగాగల రాయబారవర్గ సభ్యులు అయిదుగురు యిక్కడ అష్టమసైన్య నాయకుడు లెఫ్టినెంట్ జనరల్ జేమ్స్ వాన్‌ఫ్లీట్‌తో సంప్రతింపులు జరిపారు.

ఐక్యరాజ్య రాయబారవర్గం కేసంగ్‌కు రేపు ప్రొద్దున జీపులలో బయలుదేరి వెళ్తుందని తెలుస్తున్నది.

టోకియో, జూలై 9: జనరల్ రిడ్జ్వే ఈవేళ యిక్కడపత్రికావిలేఖరులతో ప్రసంగిస్తూ, కమ్యూనిస్టులతో రాయబారాలు ఇప్పుడు క్లిష్టమైన అసలు ఘట్టంలోకి వచ్చాయనీ, శాంతి సంప్రతింపులు విఫలం అవుతాయో లేక సఫలమౌతాయో అన్నదియింకా చాలాఅనుమానాస్పదంగా నేవున్న దనీఅన్నాడు.

## ఆహారమంత్రి పర్యటన

మదరాసు, జులై 9: మదరాసు ప్రభుత్వ ఆహారమంత్రి శ్రీ కోవ్ విక్టోరియాగారు జులై 13 వ తేదీ రాత్రి 8-30 గం కలకత్తా మెయిలులో మదరాసు నుండి బయల్దేరి విజయవాడ సామర్లకోట కాకినాడ శ్రీకాకుళం వాల్తేరు విజయనగరం బొబ్బిలి వెళ్ళి తిరిగి 21 వ తేదీ ఉదయం మదరాసు వస్తారు.

## హైదరాబాదు (ఉస్మాన్‌గంజ్) మార్కెటు ధరలు

(వల్లభదాసు గుప్తా అండ్ కంపెనీగారి పంపినది)

హైదరాబాదు, జూలై 9: బంగారం తులం 1: 132-8-0 కి వెండి 100 కు 225-0-0.

పల్లా ఒకటికి పసుపు 80-100 పెసలు 66-67. కందులు 53-57; మినుములు 85-0-0 కందులు 61-61-8-0 ఉలవలు 49-0-0 కందిపప్పు 72-0-0 ఎందిపప్పు చిన్నవి 63-8-0. పెసరపప్పు 85-0-0 మినపపప్పు 120-122-0-0 వేరుశెనగపప్పు 115-0-0 ఆముదాలు 102 చింతపండు 40-50; మిర్చి 150-200 కుసుమలు 71-0-0 ధనియాలు 16 శెనగలు 36-0-0 అవాలు 15-17 ఉల్లిగడ్డ పల్లా 1 కి 25-33

## కాంగ్రెసు సభ్యుల రాజీనామాలు

### కళా వెంకట్రావుగారి వివరణ

బెంగుళూరు జూలై 9: నేటివరకు కాంగ్రెసు నుండి ఎందరెందరు రాజీనామాలు యిచ్చిందీ తెలియచేయమని అందరు ప్రదేశ్ కాంగ్రెసు సంఘాధ్యక్షులకు తాఖీదులు పంపి వున్నట్లు, యిప్పటికి 14 గురు ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు సమాధానాలు యిచ్చినట్లు కాంగ్రెసు ప్రధానకార్యదర్శి కళా వెంకట్రావుగారు నేడిక్కడ తెలియచేశారు. ఇప్పటివరకు వచ్చిన అంకెలనుబట్టి కేరళ రాష్ట్రంలో హెచ్చుమంది రాజీనామాలు యిచ్చారు. ఈ రాష్ట్రంలో 634 మంది రాజీనామాలు యిచ్చారు. ఆంధ్రలో 204 గురు రాజీనామాలు యిచ్చారు. బొంబాయి, హైదరాబాదు రాష్ట్రాలలో ఎవరూ రాజీనామాలు యీయలేదు.

### గౌ॥ శ్రీ తిరుమలరావుగారి రాక

మదరాసు, జూలై 9: ఇండియా ప్రభుత్వ ఆహారశాఖ డిప్యూటీమంత్రి శ్రీ యం. తిరుమలరావుగారు యీదినం ఉదయం కలకత్తా మెయిలులో మదరాసు వచ్చారు.

వారు యీ మధ్యాహ్నం శ్రీ నీలం సంజీవరెడ్డిగారిని కలుసుకొని పరామర్శించారు. అడయారులో డా॥ పట్టాభి సీతారామయ్యగారిని కూడా సందర్శించారు.

శ్రీ తిరుమలరావుగారు ఎల్లుండి తిరుపతికి పోనున్నారు.

### మదరాసు బియ్యం కోటా పెరిగేవీలు కన్పించదు

ఇండియా ప్రభుత్వ ఆహారశాఖ ఉపమంత్రి శ్రీ తిరుమలరావుగారు పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ ఈజిప్ట్ నుంచిగాని బర్మానుంచిగాని అనుకొన్నట్లుబియ్యం వచ్చే అవకాశం కన్పించుటలేదని అందువల్ల మదరాసుకు యిచ్చే బియ్యం కోటా పెంచటానికి వీలున్నట్లు కన్పించలేదని చెప్పారు. యీ సాలు ఆఖరువరకు మదరాసు రాష్ట్ర ప్రజలకు 8 ఔన్సుల బియ్యం సప్లయి చేయటానికి 1.5 లక్ష టన్నుల లోటు ఏర్పడునని మదరాసు ముఖ్యమంత్రి తెలిపిన అంశమును గూర్చి అభిప్రాయం తెలుపుతూ అందుకు రాష్ట్ర ప్రభుత్వం ముఖ్యంగా ధాన్యసేకరణమీదనే ఆధారపడవలసి యుండునని బయట నుండి వచ్చే సప్లయిలమీద ఆశపెట్టుకొని ప్రయోజనం ఉండదని ఉపమంత్రిగారు అన్నారు.

చెన్నపట్నం, జూలై 9: మద్రాసు మంత్రివర్గ సమావేశం మంత్రివర్గ మందిరంలో ముఖ్యమంత్రి కుమారస్వామి రాజాగారి అధ్యక్షతను నేడు జరిగింది.

